కుసుమితసురతరుప్రవిసరశోభితమును, కూజద్విహంగ సంకులతమంబు
గాయన్మదాత్త భృంగావళీకలితంబు, నైన సుందరగృహోద్యానవనము

గీ. నింద్రకాంతలకేని నభీప్సితతమ, మైన గృహమును గాంచి తత్సదాస్థ విడిచి
తనయవిశ్లేషణాతురత్వమునఁ జేసి, కించపఱచెను మోమునొక్కించుకంత. 871

గీ. జ్ఞాతతత్త్వయయ్యును దేవహూతితనదు, భర్త సన్యాసమును బూనివనికి నేగ
నందనవియోగఖిన్నయై నష్టవత్స, యైనధేనువుకై వడినయ్యె నంత. 872

గీ. ఆదిదేవుఁడుం దన యపత్యంబునైన, కపిలనాము హరిం జిత్తకమలమందు
ధ్యానమొనరించుచుండి కర్దమునిపత్ని, తానునిస్పృహయయ్యెఁ దద్భవనమందు.

క. తన తనయుఁడు కపిలుఁడు చె, ప్పినచొప్పునఁ జింతలెల్లవిడిచి ప్రసన్నా
నను ధ్యానగోచరుం దన, యుని భగవద్రూపు ధ్యానమొనరించె మదిన్. 873

వ. నిజానుభూతితిరోభూతమాయాగుణ విశేషుండును, విశ్వతోముఖుండును, నాత్మస్వరూపుండును నగు నాభగవంతు నిట్లు విశుద్ధమనంబునందు ధ్యానించి ప్రవాహరూపంబున నొప్పారుభక్తియోగంబున, బలీయంబగు వైరాగ్యంబున, బ్రహ్మాత్మాపాదకంబును, యుక్తానుష్ఠానజాతంబునునగు జ్ఞానంబున నాత్మసంశ్రయుండును, బ్రహ్మస్వరూపుండునగు భగవంతుని యందు నవస్థితబుద్ధియై జీవభావంబు దొలంగుటంజేసి వీతక్లేశయై నిర్వృతిం జెంది నిత్యారూఢసమాధి సంపన్నయగుట గుణభ్రాంతిరహితయై సుప్తోత్థితుండు స్వప్నదృష్టంబగు పదార్థంబుంబోలె నప్పుడు నిజదేహంబును స్మరింపకుండె. పదంపడి యద్దేహం బాధివిరహితంబును, నన్యపోషితంబును నగుట నకృశంబై మలంబులం బ్రచ్ఛన్నంబయ్యును సధూమకంబగు పావకంబువలె విరాజిల్లె. దేవహూతియు వాసుదేవప్రవిష్టబుద్ధియై తపోయోగమయంబును, ముక్తకేశంబును, గతాంబరంబును, దైవగుప్తంబునునగు స్వశరీరంబును దెలియకుండె. ఇట్లు కర్దమపత్ని కపిలోక్తయోగ మార్గంబునఁ దద్దయుఁ బెద్దకాలంబునకు నాత్మస్వరూపుండును, నిత్యముక్తుండును, భగవంతుండునగు పరబ్రహ్మముంబొందె. ఆ దేవహూతి యెందు బ్రహ్మసిద్ధిం బొందె నది త్రైలోక్య విశ్రుతంబగు సిద్ధిపదనామకంబగు పుణ్యక్షేత్రం బయ్యె. యోగవిధూత దైహికధాతుమలంబగు నా దేవహూతిశరీరంబు పుణ్యస్రవంతియై విరాజిల్లె. సౌమ్యుండవగు నో విదురా! సిద్ధసేవితయై యానదీమతల్లిక సర్వసిద్ధిప్రదాయకంబై యొప్పారె. భగవంతుండును మహాయోగియు నైన కపిలాచార్యుండును దండ్రియాశ్రమంబు నుండి తల్లియగు దేవహూతి యనుజ్ఞ వడసి ప్రాగుదీచియగు దిశకుఁజనియె. అట నతండు సిద్ధ, చారణ, గంధర్వ చయంబులచేతను, మునివ్రజంబులచేతను,